గద్య-

ఇది శ్రీమన్మంత్రిప్రెగడవంశపయఃపారావార రాకాసుధాకర రాజబిరుదాంకిత భుజంగరాయామాత్యపౌత్ర హరితసగోత్ర పవిత్ర దుర్గామల్లికార్జునప్రసాదరాయవరపుత్త్ర శ్రీమార్కండేయ వరప్రసాదజనిత కవితాధౌరేయ బుధజనవిధేయ భుజంగరాయనామధేయ ప్రణీతంబైన వారకాంతయను చాటుప్రబంధంబు నందు ద్వితీయవిలాసము.



శ్రీరస్తు

శ్రీమార్కండేయస్వామినేనమః.

# వారకాంత.

## తృతీయవిలాసము

క. శివసగ్వలోకనుతయుప నవమూర్తివిరాజమాననలినాక్షశరా
సవసుమజనీశచూడా భవభవసాశాపహారపటుతరనామా ౧॥

గీ. చిత్తగింపుము పైకతఁ జిత్తమలర నాశఁడత్తగణిమణియందుఁదగిలి
యున్న మెలుఁగ కప్రతిపిశమనుటకు వచ్చి పోవుచుండె నాభోగినీభోగపరత ౨॥

క. పలుకుం బలుకునఁ దేనియ లొలుక స్వాటాను రాగముట్టిపడంగాఁ
గలకలనవ్వనొకప్పుడు తలతలయునియందునందుఁ దార్క్కామును మండుక్ ౩॥

సీ. ఖేటీమనోభవఘోటీను రంళను ధూటీవిలాసముల్ ద్రోచిత్రోచ
చేటీజనానీతపీటీరసామోద పాటీరగంధముల్ మీటిమీటి
శాటీలసత్తులాకోటీమణీమయ కోటీరముల్ దగఁగూర్చికూర్చి
ఆటీకితద్రుమ వాటీకనత్పురీ పాటివిహారముల్ బరపిపరపి-

గీ. చకచకలనీను మణిమయ ముకురనికర సుకరబహుబింబ విభ్రమలశితకరదర్శ
నకరణాంచ విలాసముల్ ప్రకటపరచి పల్లవాధరత న్నిటఁ గొల్లలాడె ౪॥

చ. పదపు మెలంత వన్నియలు బాల్పడ వెవ్వరికేని యొక్కమా
టాడలిరయించి నీల్గుమతి యొక్కెడ సోఁగకురుల్ విదల్చి క్రొ
మ్ముడి యిడు జారుచున్న చనుపట్టము పైనమరించు నందయల్
గడబడెంచు నీయారము నదఁదడి మైసవరించు నొక్కచోన్ ౫॥

ఉ. మోహమునందు మాడ్కి నర మోడ్పు కనుంగవమారు బారికిన్
దాహము నొందు పోలెక్క దనమ్ము నూర్పులు వుచ్చు నల్లన్
బాహువులూఁచుచున్న దమఁ బాపము కేశవరావు వీనిచే
దోహలమైన నాంబరలధూత పటంబు క్రియం జలింపఁగన్ ౬॥

ఆ. చుంబకాశ్మమందు సూది తాకి పోలెక్క నంతరంగమింతి నంటియుండ
మత్తుఁ గొన్న రీతిఁ బొత్తు వీడఁగ లేక దాని యింటను వికితలుచు జేసె ౭॥

చ. గుసగుసలాడుకొంచు నొకకొందఱు చుట్టలు మెల్లమెల్లఁగా
హాసనముఁ జేసికొందఱు వయస్యులు కేశవరావుగారికిం
పెసఁగునె యంచుఁ గొందఱిటు లెచ్చటికేగెదరంచుఁ గొందఱు
ల్లసములనాఁడ సాగిరి చలంబును అంకుసు డించశక్యమే ౮॥

## కేశవరావుభార్య అత్తమామలతోఁ జెప్పి యేడ్చుట.

వ. ఇట్టి దుర్వార్త పెనుగాలిం దూలు శాల్మలీతూలంబు చదంబునం జెదరి యెల్లెడలం గ్రమ్మి వారియిల్లాలగు లక్ష్మిచెవింబడిన నామెయుఁ జెచ్చెర నత్తింటికివచ్చి మగని చేష్టలంగని పెట్టి యత్తమామలచెంతఁ గన్నీళ్లుం గుక్కుకొను మండ వారలిట్లనిరి.

శా. అమ్మా కన్నులనీరు పెట్టెదవదియేలా యెల్లచుట్టంబులున్
సమ్మోదంబుననున్న వారలుగ దాశారీర సౌఖ్యంబులో
పమ్ముం జెందక యుండు నే విభుఁడు నిన్ బాధింపకుండెంగదా
యిమ్మాడ్కిన్ వగఁ బొందవేన్నఁడును నేఁడీ చింతయేలా యనన్ ౧౦॥

ఉ. నాకు శరీరసౌఖ్య మొక నాటికిఁ దక్కువ గాదు సౌఖ్యముం
జేకొని రెల్లబంధువులుఁ జెప్పఁగ సిగ్గగుచుండె రెయ్యదన్
మీకొమరుండొనర్చు పని మేకొని యూరక యుండఁజాలన
య్యో కనకాంగి యంచొకతె యుండెనఁ గేమని విన్నవించెదన్ ౧౧॥

క. ఆవుదు గుండెలు జల్లన భావంబులు తల్లడిల్లి వణఁకొదవంగా
నీవంశపుగీర్తులు జెడఁ గా వీఁడు జనించెననుచుఁ గలఁగిరి వారల్ ౧౨॥

ఆ. తల్లి నీవు మాకుఁ దనయపోలిక నంటి వేమి చేయవచ్చు నీదురాత్ము
నందలింతు నమ్మ మాశక్తికొలఁదిని నూరడిల్లుమనిరి వారలపుడు ౧౩॥

ఉ. వారలు పుత్త్రుతోఁ గళరవంబులు మాఱ్పడఁ బల్కసాఁగిరా
రారదు రాత్మ నీకిటుల యాగడ మేటికి సంభవించెరా
తీరిక దైవమిచ్చుకొలఁదిం దినియూరక యుండఁజాలవే
వారవధూటి పొందెటుల వచ్చెర యెవ్వఁడు నీకుఁ జెప్పెరా ౧౪॥

గీ. హా తెలిసె నారయల బ్రాహ్మణాధముండు నేస్తకాఁడయి నీయిల్లు నీటఁ గలిపె
శాస్త్రియఁట వానిచదువు వెల్లచట్టగాను దానిమేళంబుతో వెంటఁ దగిలివచ్చె ౧౫॥

సీ. పెట్టెలోఁ గలరొక్కమిట్టిమాయంబైనఁ బడమొత్తితిమి నాఁడు పాలివాని
చిన్నపాపని చేతిచిరియుంగరమునకై దండించితిమి యింటదాసి నపుడు
కోడలి తెలిపట్టుకోకకై యొకవేళ బంధువుఁ బాపంబు బల్కినావు
రామపీఠముపయి హేమపాత్రమునకై పరదేశి నపవాదఁ బరపినావు

గీ. ఔరయివియెల్ల దానికి నర్పణంబుఁ జేసితివి నిన్ను నెవ్వఁడు చేరియుండు
నింటిదొంగను గాయంగ నెవ్వఁడోపు పనివఁదల వంచి మెల్లన నియెనతఁడు ౧౬॥

ఉ. గిట్టని దుష్టమానవులు కిల్బిషమున్న దిలేనిదెంత యున్
నెట్టనఁ గల్పిచెప్పనది నిక్కముగాఁ దలపోసి యోగతిం
దిట్టఁగ సాఁగితిందుకుఁ దీర్పరు లెవ్వరు సాక్షు లెవ్వరో
పట్టి విమర్శమెత్తుమని పైపయి నేగెను మెల్లమెల్లఁగన్ ౧౭॥

ఉ. ఏజనుఁడేనిఁ దన్నుఁగని హేళనమాడుచునుండ నిందకున్
భాజనమై రహించుడువఁ బట్టికిఁ జేరక తండ్రి తిట్టఁగా
భోజనమజ్జనాదులను బూర్వపురీతిఁ బురంధ్రిరత్నమే
రోజు సుభక్తిచేనడుప రోతకునై యొడిగట్టి గట్టిగాన్ ౧౮॥

రామదాసు తనకుమారుని చెడ్డతనమును మాటుపరచుట.

చ. నలుగురు విన్న సిగ్గు మగువన్నెఁక నెవ్వరు నేమి సేయఁగాఁ
గలరొకొ చాటుదీగనకుకై నలుడ్డ సమస్తవస్తువుల్
మలఁగ్రక దానికిచ్చుచు నమానము మానము నొక్కరీతిఁగాఁ
దలఁచు మజ్ఞానపోలెక్కవదె తానని యాత్మదలంచు నిచ్చలున్ ౧౯॥

క. జననీజనకులు నప్పుడు మనకొక్కఁడె కొడుకుగాన మఱిమఱి వీనిన్
మనసెఱియ మందలించినఁ జనునోయెటకేని యనుచు సంశయపడుచున్ ౨౦॥

క. మెలమెల్లనఁ జెప్పనిచో నలతహసీల్దారుగారి యాత్మజువలె నే
యిలు వెడలిపోవఁ జేయం గలదేమని మిన్నకుండ్రు దుకనుఁ గొనక్రియన్ ౨౧॥

ఆ. ఇట్లు జరుగుచుండ నెవ్వరేఁ యువచ్చి కొడుకు దుడుకుతనము నుడువుచుండ
రామదాసుగారు నేమి సేతునటంచుఁ బన్ని బల్కి రొకయుపాయమిట్లు ౨౨॥

శా. నేత స్థైర్యము దూలిపోవనొకఁడో సిద్ధాంతి మావానికిన్
ద్వితీయాకకకళత్రయోగమును మున్నావ్రుష్వఁగా నెంత్రయున్

భీతిం జెందుము నేయుపాయమునఁ దప్పింపంగ నౌనంచు నీ
రీతిం బూనెనె కేమి చెప్పనను చుం గ్రోధించి పల్కెం దగన్ ౨౩॥

ఆ. వాయుగ్రమ్మియున్న ప్రాఁతకూపంబొక్క పాదవిపట్టమున్న బోసిపులియొ
యనఁగ నొక్కనాఁడు కనకాంగి జననియుత్రి పానఁగ రామదాసు పుత్రి డాసి ౨౪॥

ఉ. అల్లుఁడ నేఁడు నీదు ప్రియురాలు త్రపాకులితాంతరంగయై
తెల్లము గాఁగ నీకడను దెల్పక నాకడ నైనఁ గొంకుచు
న్నెల్లెడ దివ్వెపండుగ సమీపముఁ జెందెను మేను దీనతం
బల్లవరాగమే సుపరుపందగు నంచు వచించె నావుడున్ ౨౫॥

కేశవరావు వరాలపేరుం దెచ్చి కనకాంగికిచ్చుట.

ఉ. ఆతఁడు బల్కె నీ వడుగు నంతకు నీగతి నూరకుంటి నే
ఖ్యాతియె యస్వతంత్రుఁడను గావున నింతకుఁ గొంకుమంటి నీ
రాతిరి కోర్చియున్న నవరాల సరిం జికట్టిట్టిమా
తాతల నాటి పేరొకటి తప్పక తెచ్చి యొసంగుదుం జుమీ ౨౬॥

మ. అయారాతిరి యింట నే పడక వేయన్ మేరుతుల్యంబు గాఁ
గనకంబబ్బిన నాయొక్క లక్ష్మియున వేడ్కం గూడియుండంగ జ
య్యానీచె తవరాల పేరు నిట తెమ్మంచు న్వెఱంగందియు
చ్చెఁ బ్రత్యూషమునందె తెచ్చె నొసఁగ స్వీకృతంబుగా దానికిన్

వ అయ్యెడ ౨౮॥

సీ. చిందులాడెడు మెట్టెలం దెలు మేళమై కరము సొంపు వగళ్ళు గళ్ళు మనఁగ
సమయంబుఁగని పెట్టి చన్గవయుదరంట దొరికిన లేగాను సుకుక్క చుండఁ
బతిబదంబునఁ దూలి పడుచుఁ దూగాడు మంచి బిరుదు పైజడకుప్పె బిరుదు చాల
ఎన్నుతక్కువ యొకాటనిం చుక వేళ్ళ చేసారించుమ పయ్యెద జారుచుండఁ

గీ. జిరుగవు వెన్నెలలు తమ్ముఁ జేరు ప్రియుని దృక్చకోరములకు విందు దేల్చుచుండ
మోదము ప్పొంగ వచ్చి యమ్ముద్దుగుమ్మ గాఢతరముగఁ గేశవుఁ గౌఁగలించె ౨౯॥

పాప కూతురగు కనకాంగికి మాయోపాయంబులు దెల్పుట.

ఉ. పిమ్మటఁ బాపయొక్క తఱిబిడ్డను జేరఁగఁ జీరి యిట్లనున్
సమ్మతిఁ బుట్టఁ జేసియును జయ్యనఁ గోపనఁ జూపి వాపుచి
త్తమ్మతిరక్తి నున్న యెడఁ దారొనజాగొనరించియుండగన్
నెమ్మది మీఱ విత్తమును నేర్పున లాగఁగఁ జాలవే మఁటన్ 3౦॥

గీ. సాని బిడ్డవుగాని సంసారిణివఁటె చిన్నదాన వెనీకెన్ని చెప్పఁగలను
కలిపి పెట్టిన యన్నంబుఁ గఱపి పెట్టి బుద్ధియును మానవులకేమి పుష్టిఁ జేయు 3౧॥

క. జవ్వనము శాశ్వతంబే యివ్వడి దేహంబునందు నించుక తగ్గన్
గివ్వకుమారవు సుమ్మీ యెవ్వఁడుఁ గన్నెత్తి నిన్ను నీక్షించఁడు గా 3౨

క. వేవేగ మెదవ మెల్లన్ వేవంగా వలయుఁ గాదె తీపున్న పుడే
తీవియ బోఁడీ మనమిఁక నేవిధమున బాగుపడుదు మెంచుము బుద్ధిన్ ౩౩॥
మ. తరుణీ మెన్నను బ్రాయ మొందిది చతురత్వం బెంతయో నేర్చినీ
సరిరాకా పల్లవపాణియే పుమెయి మేజస్త్రీ యిటు వారిన్నిరం
తరమున్ జేబున వేసి లంచములకుం దాఁ గాసియుండున్ స్వరా
సరియే డాదికి వేయి రూప్యకములు న్సాధించ లేవే మనన్ ౩౪॥
క. బెట్టుసరిన్ ధనమును రాఁ బట్టుమతఁడు రాగ మింటి పడఁతుక యందుం
బుట్టించు నీచేతం బెట్టఁడు పైసయును నిన్ను పేక్షించుఁ జామీ ౩౫॥
వ. అనిన వినియట్ల చేసెదనని ౩౬॥
ఉ. కన్నె తికంబు నాటి సుదగాని సుఁ గోరు మనెక్కె యెన్ని యో
యెన్నుచునుంటి నేటికి మదీప్సితము ల్సమకూరె నీవు నే
నెన్నఁడు బాయకుందమిటు లిష్టము యేనియు బాసఁ జేతమం
చన్నలినాక్షి వల్కనతఁ డట్లొనరించె వివిశ్చలాత్మతన్ ౩౭॥

కనకాంగి కేశవరావుతో లక్ష్మిపై నిందలు మోపి చెప్పుట.

గీ. ఆకటన నుజూచి వలవల లాడు మండు నేమి చేసితి నీభార్య కేవటంచుఁ
గొండెములు వల్కె కేశవాఖ్యునకు సాధ్వి యఁదు నెయ్యము దొలఁగంగ నాడు మంచు॥
క. ఒకనాఁడు కేశవునికం శుకముఖ భూషలను దాడఁగి సుదతీమణి వీ
థికిఁ బోకు దృష్టిదోషము నకు లోఁబడుదువో యటం చునగు చుంబలికెన్ ౩౯॥
క. ఆరమణుని నొకవేళం జేరలతోఁ గనులు మూసి చెప్పుము నేనే
చీరఁ గట్టితిర వికయు నేరీతి దనీదు నేర్పు నెంచెద నని యోన్ ౪౦॥
ఉ. చుట్టలు చెంత నుండ నొకచోనను కాటుక కన్నుదోయి కిం
బెట్టుచునుండఁ గేశవుఁడు మెల్లనఁ జాటున వచ్చి చేలముం
బట్టుకు లాగ నుస్సుమని బందులు చూచుచు నుండరయ్య యో
యిట్టుల వేగ పాటు గద యెల్లపుడంచు నొకింత నవ్వెడిన్ ౪౧॥
ఉ. వెన్నెల బైట సజ్జపయి వేడుకఁ గాఁడు పవిష్టుఁడైనచో
గిన్నెల గంధమత్తరు వొగిన్ మెయిఁ బూయుము నింతియుట్లనుం
బెన్నిధి నాకునొక్కటి లభించిన నాజనయిత్రి యాశవీ
ర్యున్నను నెన్నఁ డేనియు నుదొందర జేయక యుండుడబ్బకై ౪౨॥
ఉ. ఇంతటి వేళదాక యెటకేగితివీగఁ టసోఁగలౌశితో
జాంతిము లేటికిం జెదిరెనంబర మేలని లింగనట్లు మే
నెంతయు వేసబంబడఁగ నేమికతం బొనిజంబుఁ జెప్పమే
కాంతకు నొమ్ము పండెనని గద్దఱిమ టలు వల్కె నొక్కెడన్ ౪౩॥

మ. విటుఁడే తేరెడి వేళ బాగియతఁడు న్వేవచ్చియజ్ఞాక్షి తా
నెటకోయే గనటంచు సంశయముతో నీక్షించుచుండంగ వె
న్కటిత్రోవం జని సెజ్జఁ జేరియతనిం గౌఁగింటలోఁ జేర్చి నే
నెటకేతెంచితినంచు వాక్యలతతో నీక్షింతు నొక్కొయనున్ ౪౪॥

వ. అప్పుడప్పుడ కేశవరావు మానసంబు వశపరుపం దలంచుచుఁ గనకాంగి వానికి నిట్లని పల్కుచుండు. ౪౫॥

క. నోఁచితి నెంతయు నీకై యూచక్కందనముఁ గాన నితరులకన్యుల్
బూములు గదవన్న నీవిడఁ జూచితి వేనియును విడువఁ జూతుం దనువున్ ౪౬॥

## కనకాంగి తనతల్లిచర్య కేశవరావునకుం జెప్పుట.

క. నినువిడచియున్నఁ గూడం జనుమను మాతల్లి ధనముసంపాదింపన్
నినువిడఁజాలన్ నీవా ధనముందానికి నొసంగితగఁ బ్రోవునన్ ౪౭॥

క. లోకులకు వెఱచియుంటం గాక భవద్గేహమందు గదియొకటియిడన్
నీకడ నేనివసించెద నాకసుఖము లెల్లమిగులనందఁగవచ్చున్ ౪౮॥

ఉ. ఇక్కడనుండి సొమ్మునకు నేడ్చుచునుండును నాదుతల్లి నే
నొక్కక్షణంబు నీకడన యుండిన బిల్చుచునుండు సౌఖ్యముం
దక్కదు గాన నా నుడివినందగు మీభవనంబు చెంత నా
కొక్కగృహంబుఁ గట్టియిడనుందును నిన్నెడబాయకెప్పుడున్ ౪౯॥

శా. నాకుం గన్నెతెకింపు నాధుఁడిట నున్నంగీముబంగారమే
కాకిట్లుండె నె సౌఖ్యపర్యమతఁ డేఁ ట్రించె నేనన్యునిం
జేకోఁజాలకయుండియుండితుదకుం జేకొంటిమి మ్మెంచుచున్
మీకున్నాపయిఁ బ్రేమలేదుగద నెమ్మిం జూతురే పూరుషుల్ ౫౦॥

ఉ. ఆపణవీధి నీవు సరిగంచులదోవతిఁ బూనిరాఁగ నీ
వా పువకేగుదెంతునని చూపుదు సొమ్ములుఁ బట్టురైకయుం
దోపుపటంబుఁ దాల్చుకొని తోనరుదేంగ వేడ్కనుంటి నే
నాపఁగఁజాలనైతిమదినప్పటినుండియు నిన్నుఁ జూడఁగన్ ౫౧॥

గీ. పాపదైవంబు నన్ను నీభార్యఁ గాఁగఁ జేయకీపాడు వేశ్యగాఁ జేసెఁ గట
యిరువురికి నొక్కకులమైన నేలచేయఁ డొక్కచోఁ దిని యొక్కచో నుందుముగద॥

గీ. బాసలొనరించి ప్రేమముఁ బరఁగఁ జేసి యొక్కకపటంబుఁ బన్ని యిట్లారకుంటి
ప్రేమగలవారివీడుట వృజినముగద పురుషులకు నీతియనుమాట బోడమఁ బోదు ౫౩॥

క. నాపయి మీపౌరుషముం జూపుట పిచ్చుకకుఁ బైని జాఱచుఱ బ్రహ్మా
స్త్రోపాయము నన్నిట్లుగ నేవన్నెఁ జేయఁగలదియేదియుఁ గలదే ౫౪॥

వ. ఒక్కనాఁడు కనకాంగి కేశవరాయని వచ్చువేళఁ గని యథాపూర్వంబుగా నుండ

కకిలకిలనవ్వుచు నెదురేగక కుపితచిత్తయుంబోలె నున్న నక్కాముకుండు వచ్చి దా
నింగాంచి గుండియలు జల్లుమన నిట్లనియె ౫౫॥

ఉ. ప్రాణసమాన నీవు వినయంబున ద్వారము చెంతనుండి నా
పాణితలంబు నీదు కరపంకజమందరించి నవ్వుచుం
బోణిమి మీఱ హర్మ్యమును బొందఁగఁ జేసి మనోహరంబుగా
వీణియ మీటుదాన విటు విన్నదనంబున నుంటివేమొకో ౫౬॥

క. ఎలనాగ లెమ్ము నీవాక్కలనాదామృతరసంబుఁ గణఁగాయుఁగ ద్రో
ఖులనానకుండ నోర్వం గలనా నాతోడ నీకుఁ గలవా చెపుమా ౫౭॥

ఉ. అప్పుడు చిట్టిపాప వినయాఢ్యయుఁ బోలె వచించె నిట్లుగాఁ
జెప్పెదఁ జక్కఁగా వినుమి నీ యిది మైఁ బొగ రెక్కి యీక్రియన్
దిప్పరఁ బెట్టుచుండె మదిఁ ద్రుప్తి జనింపక యీసభద్దచోఁ
దప్పక నిందఁ జెందును గదా పురుషుండు వఘాటియున్ మహిన్ ౫౮॥

పాప తనకుమార్తె కోరిక కేశవరావుతోఁ జెప్పుట.

గీ. ఒకరియింట వివాహమహోత్సవమున వాగవాసంబు విజయాఖ్యనగరినుండి
వచ్చె వారలు దొడఁగిరి పలకపూస, నేవళంబులు నవరీతి నెగడుచుండు ౫౯॥

చ. అవికలయంగఁ జూచి తనకట్టివి గావలెనంచు గట్టిగాఁ
బొవులుచునుండె గేహమునఁ బుత్తడి ముద్దులు పుట్టఁ బోవురేఁ
బవలును నిన్న సౌఖ్యులని బాధయొనర్పఁగ నోరు రాదు గా
రవమిటులైన చోఁ దనకు రాదుగదా యిఁకఁ దెల్వి గల్గునే ౬౦॥

ఆ. పసిఁడిపూతగిండి పగిది గానొకరీతిఁ గాపురంబు మెఱుఁగు గానరాఁగ
మెలఁగి వలయుఁ గాక పలుపెద్దపోకలు బోదు రేని కూలిపోరె యేరు ౬౧॥

చ. పొసఁగ నిపట్టుఁ బట్టియటు పొక్కుచు నుండును నేటికి వునీ
బసకరు దేరనిన్నియును బాగగు తోఁపటికంచుఁ బంచియ
మ్ముసలిది పట్టికిన్ మఱల బోధయొర్చ యథాస్థితంబుగా
నెసఁగఁగఁ జేసి కాముకున కిట్లనియెన్ మనసాటి వేసవన్ ౬౨॥

ఆ. గట్టిగుండె గలది పట్టినిదూరంగఁ దగిదుగాని నీరుఁ ద్రావకుండె
నన్నమంటకుండె మొన్నటినుండియుఁ జేయుబోన దాని చెవిఁ జొరదు ౬౩॥

మ. పరులన్ వేడఁగ నుద్యమింపదు గదా ప్రాణంబుతో నుండియే
కరణింజూడఁగ నోర్తునోర్తుఁ గద నాగర్భంబునం బుట్టెనీ
తురుము న్నా కృపవాసమయ్యె నను మందుఃఖించె గన్నీరు బి
ట్టురలన్ వేశ్యలబూటకంబు లితరుల్ యోజింపఁగా నేర్తురే ౬౪॥

క. అదివిని కేశవరావునుఁ బదఁపడి నీవింత చింతఁ బడకుము పాపా
యదియెంతటి వెలఁగలయది పదునానూటులోనె తెలియఁబఱుమట నన్నున్ ౬౫॥

శా. అల్పాఘ్రాణంబునఁ జేతఁ జేరునది గాదట్లౌట నేనీకడం
జెల్వంజాలక యూరకుంటి నిమిషుండే తెమ్మనన్ శ్రీదులే
కల్పాగంబులె మీరు కాపురములం గాపాడఁగా వద్దొ మీ
ప్రాల్పే మాకును పోల్పు మీకు చెడ మమ్ముం జూతురే యేరనన్ ౧౬॥

క. గొడ్డుదియును నాఁకఁట వెతఁ బడ్డజముని జూచి మిగులవగఁ బొందుఁగదా
దుడ్డెలఁ గన్నదియట్లు పై బిడ్డకుని బైరి నెంత వెతనొందునో శౌరీ ౧౭॥

క. మక్కువ నాకుం గలదని కక్కురితిం జెందునది యుఁగాదిది యెంతో
పొక్కుచుఁ జెప్పఁగఁ పొఁగెన్ నిక్కంబుగ నూరకుంట యింద్యము నాకున్ ౧౮॥

గీ. అనుచుఁ దలపోయుచో జరద్వనిత వల్కె నాసపడియా వృపాదు గెల్లఁగొనిట్టి
చందమగు నిన్ను దానికిఁ జాలినంత సొమ్ముఁ దెమ్మనఁ వోక యుపాయమ్ము వినుము ౧౯॥

## పాప కేశవరావుతో వస్తుప్రకిమ్మతు చెప్పట.

చ. అదియొక వేయిరౌప్యములయర్ఘ్యమునందనరారుచుండుమ
ప్పదిపదులైనరొక్కమును బట్టుక తెచ్చియొసంగి తక్కుడె
బ్బదిపదులప్పుగొంటినని పత్రము వ్రాసియొసంగుమయ్య నే
నదిగిరవుంచియొక్కయెడనర్థము దెచ్చెదచూతమాపయిన్ ౨౦॥

క. ఎఱిఁగియు యెఱుఁగకయుంటిన్ మఱియొక సంశయము మీరు మది గం చకుఁడీ
కొఱఁతధనము నాకుం జేకుఱ మింపత్రంబు మిమ్ముఁ గోరన్ వలసెన్ ౨౧॥

మ. అకటా యాతని లౌకిక ప్రతిభ యేమైపోయెనో వారనా
రికిలో నైనసమస్తముఁ జనును గూర్చిన్ దానిమంచంబు చెం
తకు వే వేగ మెయేగి మమ్మునిటులం దంటాలఁ బెట్టంగనీ
కొకలాభంబటె లేచి చెప్పుమి దెనీ యుల్లాసముం దీర్చెదన్ ౨౨॥

క, ఏమే హేమలతాంగి యేమే యాహోదరుచిరషీమకరవక్త్రా
యేయే తామరసాక్షీ యేమే మోమెత్తి చూడవేటికె యలుఁగన్ ౨౩॥

క, అనసమ్ముద్దియ మెల్లన స్తనతటవిస్రస్తపటము సవరించుచు వీ
డినకొప్పు ముడిచికొను మంగినుకదనుకు ముండ నెట్టకేలకు లేచెన్ ౨౪॥

ఉ, లేచియొకింత యూర్పులు చలింపఁగ వాసిఁ బులుకు పులుకనం
జూచి యిదేమి యయ్య పలుసోద్దెము నాతలనొప్పి యెత్తెఁగా
నో చెలయేచ సాగిరిముహూర్తమునన్ శయనింపనియ్యరే
మీ చెవి నేమి కోవిని చెవృత్యువు నాకిది తల్లి గాదు గా ౨౫॥

ఆ, మేనజబ్బు వొడమె మీ కేల ఈ బాధ యొకటఁ బలుకు చందురింపు గాను
గన్ను మాటువడినఁ గావలె నేమీ కు నాదు బాధ మఱియు నాతలంపు ౨౬॥

## కేశవరావు కనకాంగియభిప్రాయమడుగుట.

ఆ. అనినఁ బడపుకత్తె కాంతఁ డిట్లను చిత్త బాధ వలన మేని బాధ వొడము
నొందుఁగల్గనీకు నొందు జెప్పఁగ నేల నీదు నెనరుఁ దెల్ప నిశ్చయముగ ౨౭॥
చ. నిను నెడబాసి నేక్షణము నిల్వఁగఁ జాలను నా మనంబు నా
ధవ తను నాదు ప్రాణములుఁ దప్పక సర్వము నీవె సుమ్మ నె
మ్మనమున నమ్మవేని యును మానక బాసయొనర్తుఁ జూడుమి
ట్లనకు మసహ్య భాషితశరాహతిఁ గూల్చఁగ నీకు న్యాయమే ౨౮॥
ఆ. ఇట్టు బల్కుచున్న యెమ్మెకానినిఁ జూచి పడపుపడఁతి మఱలఁ బలికె నన్న
నడుగ నేల మీకు నడువ దేమాయమ్మ యతిఁగి యుండి యడుగుమేమి సొగసు ౨౯॥
ఆ. అంతఁ గాంతుఁ డింతి మంతనంబునఁ బల్కె నింత పంత మింత వంత యేల
కాంత వింత గాను గాంతు వేసాచెంత నింత యంతరంగ చింత మాటి ౩౦॥
వ. అనియొక్కనాఁడు ౩౧॥
ఉ. తండ్రియు గర్భగేహమున దాచిన పేటికఁ జౌర్యవృత్తి నె
వ్వఁడును జూడకుండఁగ రవంబు జనించక యుండ ధైర్యముం
దీండ్రిల మా యుతాళమునఁ దీసి తత్త్రయ రౌప్యముల్వడిం
గాండ్ర యతండు దెచ్చి గణికామణి కప్పన సేసి వేండియుం ౩౨॥
క. పత్రంబును వేశ్యాజన యిత్రికిఁ దన చేత వ్రాసి యిచ్చి ధనంబుం
ద్వత్త్రదినంబులలోనా చిత్రాలంకారమునకుఁ జేర్చియొసంగెన్ ౩౩॥
వ. ఆపత్త్రంబును బండ్రెండు వన్నెల మెఱుఁగొక్క రుక్మంబు విలిచి నాఁడెంపు చేతం
బ్రసిద్ధుండగు నొక్కనాఁడింధముని చేత నొక్కనాఁడును విడువక కొన్ని దినంబుల కా
యాభరణంబుం జేయించి యిచ్చె నదట నంతరంబ ౩౪॥
చ. అది మొదలా సరోజముఖి యర్ఘ్యము పాద్యము నిచ్చుచుండె నె
మ్మది కహితంబొనర్చు మనమాటికి నవ్వులు హాస్యవాక్యముల్
గొదుకక పల్కుమున్ మఱలఁ గొల్పియ నేక విచిత్ర భోగ సం
పదలను గొన్ని నాళ్ళతని భావము మెచ్చఁగ వేడ్క సేయుచున్ ౩౫॥
మ. ఒకనాఁ డొక్క వసంతకాలమున నత్యుచ్చాగ్ర మామేడపై
నకలంక స్థితిఁ బండు వెన్నెలలు గాయం దా వుటన్నిష్కుటాం
తికపాతంబులు జల్లను ల్లెవిరులన్నిం డైనపూసజ్జ నా
యకుఁ డుండందగఁ బ్రక్కఁ జేరి మధుర వ్యాహారముల్వల్కుచున్ ౩౬॥
క. నాకుఁ గలకొదువ లెల్లన్ నీకడ వివరింపకుండ నేర్చెదనె ప్రియా
నాకొందున నుంగొంగిటఁ జేకొని యమ్మధుర వాణి చెప్పఁ దొడఁగెన్ ౩౭॥
ఉ. నాజనయిత్రి దుర్గతి ధనంబున బ్రాణములం గెఁబెట్టు నే
పూజయొనర్చి దీనికి నిబుట్టితి నోకడ ప్రాణనాయకా

రోజునొక్క పైసయును రాయిడఁజాలదిఁకేమి సేతునే
యోజనభీష్టవస్తువులనొందెడు సౌఖ్యము నాకుఁగల్గెడున్ ౫౮॥
శా. ఆశీతాంశుముఖీ వచించెనతఁడిట్లాలాగుసందేహమే
లాశోభావతి నేనుగల్గఁగమనోలౌల్యంబు వీడందగుం
బైశాచప్రతిబంధమాయసనను న్నాతండ్రి బాధించుఁగా
కాశంకంబడకున్న నీగృహమునిష్టార్థంబులన్నింప నే ౫౯॥
చ. దినదినమొక్క రౌప్యకము దెచ్చెదయొసంగుదునంచుఁ జెప్పి మె
ల్లనఁదనతండ్రి మంచపుతలాడకడంగల బీగమెత్తి కో
ట్లునఁగలధాన్యమప్పడపుడున్ వెలకిచ్చుచుఁదద్ధనంబును
వ్వనజముఖీశిరోమణికి వైశికవేతనమిచ్చు శంకరో ౬౦॥

## రామదాసు రోగగ్రస్థుఁడయి చనిపోవుట.

ఆ. ఇట్లుకొంతకాలమేగుచునుండంగ దైవయోగమిట్లుదప్పవచ్చు
రామదాసు దేహమామయగ్రస్తమై పీఠపూజయెడు పేశమాసె ౬౧॥
సీ. జయగంటలును తాళచయమృదంగంబులు విలిచితాంబూలంపు వెలకునిచ్చి
పూజసల్పెడుపాత్రములనుబంధకముంచి మేలిచీరలకని మెలఁతకొసఁగి
వెండిసంపుటములు వెలువక చెలపించి కింకిణుల్ ముదితకుగీలుకొల్పి
కనకవిగ్రహములు గఱగించి దానికి హస్తకంకణములనమరఁజేసి
గీ. కొమరుఁడీగతిఁదండ్రి దేహమున దెవులు పెఱుఁగుకొలఁదిని బీరంబుదఱుఁగఁజేసె
కాముకులువంచిచెడ్డలఁగాంతురెట్లు గణికనొక దేవతనుగాఁగగణుతి సేసె ౬౨॥
క. అమలమతి రామదాసుం గ్రమముననక్షీణించియొక్కకాలము సీతా
రమణునిమదిలో నెంచుచు నమరవరపురప్రయాణమమరంజేసెన్ ౬౩॥
ఆ. వారిభూరివిత్తవారియుంచించుక పొరలినంతపొరలిపోవుఁగాక
యింకముందుసలమటేగతిఁ జేకూరు దిట్టమైనయట్టి కట్టువిరిగె ౬౪॥
వ. ఇట్లు పితృవియోగంబైన శోకంబునకు వెఱవవలయునను తేనిదుఃఖంబున నించుక చింతించి వెలిబెట్టుదురను భీతినొల్లియొల్లకగా నౌర్ధ్వదైహికం బాచరించుచువిపాపంబులయెడ నిడియేటికని యెంతింపుము నట్టిదశరాత్రమధ్యంబున నొక్కనాఁడు ౬౫॥
ఉ. మదిగనకాంగి పైఁదగిలిమాటిన వేసముగల్గియుండుటం
బెదరక యర్ధరాత్రమున భీకరసంతమసంబుతోడుగా
వెదకుచువచ్చి దానిగృహవేదికఁ జెంగట నిల్చి మెల్లనం
గదిపెఁగవాటమాజఁగని గ్రక్కున దీసి వచించెనాతనిన్ ౬౬॥

## పాప కేశవరావును మందలించుట.

కం. ఇటు లేలవచ్చితయ్యా కటకటనీ చేయుకర్మ కాండం బెల్లం
దటు కనఁ జెడి పోవుదువె కుటిలంపుఁ బనిఁ జేయ నెట్లు కోరికబుట్టెన్ ౯౭॥
ఆ. ఇంట వెలఁది నైన నెనయరీదినముల వారవనిత పొందు వలతువయ్య
యశుచి వైననిన్ను నంటంగ మాకంత పాపభీతి లేదె పదుము పదుము ౯౮॥
వ. అనిన నాతం డిట్లనియె ౯౯॥
ఉ. పొందు నెయిట్టి పల్కఁడు వోయిననొక్కఁడు మైల నేగతిం
జెందును జెందనేని పెనుచీకటి కైవడి వచ్చి క్రమ్మెనే
హిందువు లిట్టి వెట్టిఁ బడియే చెదరన్యుల కేల లేదొకో
కొందఱి మేను భూతములకూడిక చేజనియింపలేదొకో ౧౦౦॥
వ. అనిన నదియు. ౧౦౧॥
చ. పదపదయిట్టి యుక్తులను బల్కక కొందఱు తెల్పఁ గొందఱిం
పొదవుచు నంద్రు వల్పగు మనొక్కఁడు యోగ్యుఁ డొక్కఁడుం డుగు
ర్మదుఁ డయి యట్లు ధర్మములు మాఱుట తప్పొకొ యుక్తులేలనీ
సదనముఁ జెందు పొమ్మని సజయ్య నాతఁడు వోయె నింటికిన్ ౧౦౨॥
గీ. పోయి యాతఁడు పదిరెండు ప్రొద్దు లాత్రగట్టిగాఁ బట్టి వెడలించి యొట్టకేని
పడపుచెలి యింటికేగు చోఁ బాదయుగముఁ బట్టికన్నీరు విడముచుఁ బలికె లక్ష్మి ౧౦౩॥

## లక్ష్మి కేశవరావును చేఁగొని నీతిచెప్పిన బెత్తముతోఁ గొట్టుట.

చ. నిముసము లోపగించకుఁడు నేనొకవిన్నపమాచరింతున
క్రమమిది మాస మేనియును గాదు మహత్తరులైన తండ్రిగా
రమరులవీఁటికిం జనిరి హా యిలనదీక్షయొనర్చు వారు సప్ర
ప్రమదను గూడ కుండరుఁ టవారవధూటుల పొందుయుక్తమే ౧౦౪॥
ఆ. పెద్దలున్నయపుడు పిన్నవారలు మీరు వారలిపుడు దూరమైరి గాన
యింటికాధ్యులౌట హెచ్చైనకీర్తులఁ బడయవలయు జన్మఫలము గాదె ౧౦౫॥
క. అనదండ తాడితంబగు ఘనతరకాలాహిపగిది గనలుచు సాధ్విం
గనుఁగొని నాకడ నీ వేవెనుదీయక ధర్మములను వినుపింతువహా ౧౦౬॥
చ. వెఱపొక యింత లేక పదవిన్ననుచద్దము దాకి ధర్మముల్
గఱపు మిఁక బేలసాఁగితి వికేవొకొ పైదలి నం మదంతముల్
గొఱుకు మనాకు నిట్టి పలుకుల్ గొఱగావని తూలఁ బల్కుచుం
జుఱచు అఁ జూచి బెత్తమునఁ జూట్టున వీపుపై చెనా సత్కెన్ ౧౦౭॥
వ. ఇట్లు వైచిన శివశివా యని మఱి యత్తకయినం జెప్పక గృహంబునందుండి భర్త
కుం బూర్వరీతి శుశ్రూషఁ జేయుచుండె నాతండు గడఁకత్తె యింటికిం బోయి దా

నీయడిగిన సొమ్ములెల్ల నిర్నిరోధంబుగ నిచ్చుచుం దవేకాయత్తచిత్తుండై యుం
డుఁ గత ౧౦౮॥

ఉ. చెంగటి వేశ్యకల్లవిటశేఖరుఁ డిచ్చెనఁ బ్రేమమీఱ నీ
ప్రంగన గొమ్మటం చనుచు వారసుచీరయొకండు దెచ్చి వా
రాంగన యెట్టులుం డెనని యాఁగడ లెన్నయటంచు తత్ పదం
గొంగున గొట్టి తీర్చి తివిశోరక నంచు ధరంబు వంచుచున్ ౧౦౯॥

క. నీపాటి నాణెమెఱుఁగుదు నోపిన వెలఁజెప్పుమనుట నొక వందపయిన్
రూపాయలేఁ బదియనఁగ నోపుదునే నేనియిట్టి యుక్తులు సెప్పన్ ౧౧౦॥

గీ. అనిన నగియింత గీర్వాణమాడనేల గావలయునిట్టి దని తెల్పఁగావలవదె
యనుచు నమ్మ్రదిత ప్పక యనువుమీఱ చీరఁగొని తెచ్చియిచ్చె సింగారవతికి ౧౧౧॥

సీ. ఒకనాఁడు తీర్థంబునకుఁ బంపవేయనఁ బాయక నూఱురూపాయ లిచ్చుఁ
బందుగ వచ్చె నెబ్బంగి సాగునటన్న బాయక నూఱురూపాయలిచ్చుఁ
బంధుగృహంబునఁ బరిణయంబని చెప్పఁ బాయక నూఱురూపాయలిచ్చుఁ
బ్రొమొక్కుఁ గొంటిమి స్వామికొక్కనాఁడని పల్కఁ బాయక నూఱురూపాయలిచ్చుఁ

గీ. అవికలకునం చుఁ జెవికెంపు జాలకంచు నత్తరులకంచు నుత్తనిమొత్తకనుచు
దిండులకునంచుఁ బన్నీరుగిండికనుచు వానిసొమ్మెల్లఁ రాఁబట్టె వారవనిత ౧౧౨॥

క. కనఁ గాంగి కాముకునితో ననుకూలత నొక్క గేహమందుండఁగ బ్ర
క్కన యంగణంబునందు జ్ఞనని యుఁ బ్రస్తావనావశంబున నంతన్ ౧౧౩॥

## పాప కేశవరావు వినునట్లితర వారకాంతల యౌన్నత్యమొకతె నేస్తకత్తెతోఁ జెప్పుట.

గీ. కేశవుని వీమలందు సోకింపఁదలఁచి పాత్రిత వేశినితో విట్టులపల్కెఁ గా
నప్పమాచి తెకలవాణి యొప్పులెల్ల మొన్నమొన్న టికన్నదిరొన్ని నేర్చె ౧౧౪॥

శా. దాసం బ్లీడరు గారొకానొకరు చేతం బట్టిరా వేరుషే
మోనానాటను దీపబూచినక్రియన్ ముత్యాల రత్నాలచే
పౌనానావిధ భూషణంబులను దేహంబెల్లనిండిన్ని మీ
దీనారంబులు పెట్టెగా దియ దిఖ్యాతింజెందెఁ బ్వీఁటిలోన్ ౧౧౫॥

చ. చదువుల నెంత నేర్చినను జక్కఁదనంబది యెంతగల్గినన్
మొదటను వారనారులకు ముఖ్యముగాఁ జతురత్వమున్న నో
టదక దృష్టమా పయిని దోడగునంతటి పొగ్గిమంబులే
మదవతికబ్బె నెంతపలుమాసి సినైనను వంచునింతలోన్ ౧౧౬॥

క. అక్కరొ దానికిఁ గల్గిన చక్కఁదనం బెంత దాని సౌరెంత టిదా
వొక్కపరి జూచి దానికి నిక్కలి రొక్కంబులీక మిగులు నెయొవఁడన్ ౧౧౭॥

నితలంచె వల్లైన నాతనికిం గవకాంగిపై యనురాగంబున కించుకయు గొఱంత
లేక సంచరించుచుండె నంత నొక్కనాఁడు ౧౨౭॥

చ. ఇరువురు నొక్కశయ్యపయి నేకతమొంబవళించియుండఁ ద
త్కరసరసీజమాత్మకరతామరసంబునఁ బూనియుంతియ
త్తఱుణునివ్రేటాలకును దారిచి మెల్లన వాని వ్రేలియుం
గరమును దీసి నీకరముగాటమొ నాదుకరంబుగాటమో ౧౨౮॥

ఉ. కాంచెదమంచు నైజకరజాంజకనిష్ఠికయందునవ్వుతో
నుంచితదంగుళీయకము నో ప్రియవల్లభ నీదు హస్తమున్
మించెను వాకరంబనుచు మేలములాడుచు నన్యముం బ్రసం
గించఁ బోడంగ నాతఁడును గిమ్మనఁ డాయె శశాంకశేఖరా ౧౨౯॥

మ. సరిగం జుల్లలఖండు వానొక ఫుడంసద్వంద్వముం జేర్చియా
సరసుండుత్సుకుఁడై చటించుతఱిఁ జంచచ్చంచరీకాక్షి త
త్కరమాలంబము గాఁగఁ దోవరిగి చిక్కంబట్టియమ్మేలియు
త్తరచేలంబును మెల్లవంబయఁట గాఁ దారించి డబ్బాటుగన్ ౧౩౦॥

క. ఆయుత్తరీయమాతఁడు చయ్యనసవరించుకొనఁగ సాఁగినవహహా
పయ్యెదలాగుచు నాతో సయ్యాటములాఁడు టేమిసాహసమనినన్ ౧౩౧॥

క. ఔరా యీచాతుర్యం బే రామలయందు నుండు నే మొకొ యిస్సీ
వారాంగనతోఁ గూడని వారదృక్కులు గాక వైభవయుతులే ౧౩౨॥

గీ. అనుచుఁ దలపోయ సాఁగె మూఢాత్ముఁ డతఁడు పతులకెత్తుకపోయెఁబైబట్టయనెడు
రీతి చేకూరెనం మను ప్రీడెఁజెందఁ డౌర కామాంధులకుఁ గాంచనౌనె యొకటి ౧౩౩॥

క. ఈకరణి సర్వధనముం జేకొని యాతని గృహావశిష్టుం జేసెన్
శోకించి రింటవన్నము గోకయుఁ గలవడక తల్లిఁగుల సతియుఁ గొడుకున్ ౧౩౪॥

ఉ. ఎంతటి భోగసంపదల నెంత ప్రతిష్ఠలఁ గాంటిమయ్యయో
వింతయొసంగనిన్నియును వ్రేల్మిడి వ్రేల్మిడి నయ్యె దైవమా
వంతయొసత్యమయ్యె నా భవచ్చరితంబున కష్టుగల్గునే
సంతతమొక్కరీతిఁ గడసాఁగునె యెంతటి మంచివానికిన్ ౧౩౫॥

క. అని యిటు దుఃఖించెను వ్యాంతారత్నములు వసువవలదను వారుం
గనరాకుండిరి పుడమిన్ ధనములు శాశ్వతములను మ్మఁదలఁ ష్నవ్వ నే ౧౩౬॥

చ. త్రిపురవిదారదానపరిదీపితనిర్మలదేహదేహభృ
న్నిపుణవిహారిహారిపదనీరజసేవకరక్షకత్రప
త్కృపణనిదానదానవవిఖండనలంపటబాణబాణదై
త్యపురనివాసవాసరనిశాధిపవహ్నిసదక్షదక్షపా ౧౩౭॥

## శాలినీవృత్తము.

శ్రీగౌరీసంశుద్ధచిత్తాబ్జభృంగా వాగీశాదిధ్యేయభవ్యస్వరూపా
నాగేంద్రాస్యప్రీణనప్రేష్ఠచిత్తా నాగేంద్రాధీడ్భూషణవ్యాప్తదేహా ౧౩౫॥

గద్య.

ఇది శ్రీమన్మంత్రిప్రెగడవంశపయఃపారావార రాకాసుధాకర రాజబిరుదాం
కిత భుజంగరాయామాత్యపౌత్ర హరితసగోత్ర పవిత్ర దుర్గామల్లికా
ర్జునప్రసాదరాయవరపుత్త్ర శ్రీమార్కండేయ వరప్రసాదజనిత
కవితాధౌరేయ బుధజనవిధేయ భుజంగరాయనామధే
య ప్రణీతంబైన వారకాంతయను చాటుప్రబం
ధంబు నందు ద్వితీయవిలాసము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు.

శ్రీమార్కండేయస్వామినే నమః.

---

# వారకాంత.

---

## చతుర్థవిలాసము.

క. శ్రీమార్కండేయేశ్వర వ్యోమాశుగవహ్ని శంబరోర్వీదినరా
ట్సోమయజమానమూర్తిధీమజ్జనవినుత దేవదేవమహేశా ౧॥

గీ. అవధరింపుము పైకథ హర్షమెసఁగ రామదాససుతుండిటు కామవృత్తిఁ
దనదుసర్వస్వము నభోగవనితపరముఁ జేసి సంసృతికైగాసిఁ జెందుచుండ ౨॥

ఉ. ఇంగితచేష్టలం గని మనీషితుఁ డుంబటు బుద్ధిశాలియౌ
సంగడికాఁడొకండు దెసదజాలి జనింపఁగ వానికిట్లనున్
భంగము రాకయుండఁగ నుపాయము జెప్పెదనోయి మిత్రమా
వెంగలివై ధనమించిపది వేమరుఁ ద్రవ్వఁగఁ బోకు మెప్పుడున్ ౩॥

ఉ. చేసినదేమొ చేసితది చెల్లుఁగఁ జేయు మనిప్పుడైవనా
దోసపుతొత్తు పైనిమది దొర్లఁగనీయక వాదుపల్కులం
బూసను గ్రుచ్చినట్లు మదిఁబొందికసేయుము నీకు నీపయిన్
వాసియు వన్నెయుం గలుగు బంధుజనంబులు మెత్తురెంతయున్ ౪॥

క. నాచెప్పెడుపలుకులు తం । డ్రీ చక్కఁగ వినుము నీదు డెందము నెవ్వం
డో్రి చెఱఁగొట్టిరిగద నే వాచఱచినసట్టిచేష్ట వదలకయుండున్ ౧౫॥
ఉ. ఇంటికిఁబెద్దవైతివిటు లిచ్చఁజరించుట నీకుధర్మమే।
యింటిని గాని నేను మృతినొందినదాన నెభర్తతోడనీ।
కంటకమేల నీకుఁ బరకామినిఁ బొందుట మేలుగాదుము।
క్రొంటికి నైన నీదృశులఁ గాంచకయుంటిమె యెందఱెందఱిన్ ౧౬॥
క. అంతటి కాపురమంతయు నింతకుఁ దెచ్చితివి నిన్ను నేమన విధియే
పంతముఁబట్టె నొకనపై సంతాపముఁ బొందెనేని చక్కంబడునే ౧౭॥
చ. పడపుపొలంతులెందఱినిఁ బాడొనరించరు భూమి నెవ్వరుం
జెడిన వాండ్రకేమి పలుచిక్కులఁ బెట్టుచు మాయలాడుచుం
గడనయొనర్చుచుం డెదరు గాకికి నొప్పియె యొద్దుపుండు పెం
పడఁగిన వారినెల్లఁ బడనాడెద రంతటిమానశీలురన్ ౧౮॥
ఉ. మాయలుచేష్టలెల్ల నెడమాటల కర్మము లేదు సత్యముల్
తోయములోని వ్రాఁతలనుఁ దోఁచు పుమాటలు వారిసొమ్ములే
హేయప్రవృత్తి నైన ధనమే గడియించుటయందు దీక్షను
మ్మాయరవింద నేత్రలకు నగ్గము నై చెడకుండ రెవ్వరున్ ౧౯॥
క. నామాట నమ్ము చక్కఁగ నీమది నూహించుకొనుము నిశ్చలవృత్తిం
గామించు వారిఁ జెరచుం బాములతోఁ జెలిమి వారభామల పొందున్ ౨౦॥
గీ. అనిన నాపల్కులను నూఱాడలేక శిరము నొక్కించి తలవంచుచు సిగ్గుగదురఁ
దస్కరునిపోల్కెఁ బోఁగముల్ ధరణియందు నల్లనల్లన జరుపుచునవలఁజనియె ౨౧॥
క. తల్లిపచించిన పలుకుల నల్లంబున మఱలమఱల నూహించికడున్
దల్లడపడుచుం జరిగిన చెల్లందల పోసికొంచు నేకతమతఁడున్ ౨౨॥
మ. ననునారాయణశాస్త్రి యింతదశఁ జెందంజేసె నీకార్యమం
దుసపాయంబొనగూడు నంచు మదిలో దోచెం దదందాని యా
వనమ్మాచక్కఁదనంబు నావలపులా వాల్జూపులా ప్రౌఢిమం
బు మనన్నిట్లుగ మత్తుమందుల క్రియన్ మోసంబునొందించదే ౨౩॥
సీ. ఒకనాఁడు వీణపాటకు మది సొక్కించి చేటెరొక్కంబెల్లఁ జేరఁదీసె
వివిధభోగంబుల వివశతనొందించి యొకనాఁడు మాన్యంబు నొడిసికొనియె
దరిఁజొచ్చి యొకనాఁడు పరిహాసమత్తత నుండంగ మురుగుల నూడలాఁగె
వ్యజనంబు నొకనాఁడు హాయిగా విసరుచు మగరాలతమ్మెట్లు మాటికొనియె
గీ. నుత్తరీయంబుకొంగున నొక్కనాఁడు ముడిచియున్నట్టి కాసులు మోహపెట్టి
పిడియమిచ్చుచు మెల్ల విప్పికొనియె నివియుమఱలౌనొ తస్కరనృత్తులౌనొ ౨౪॥
శా. ఆమాణిక్యము లెందుఁ బోయెనుహహా నీయంబైన భూషాగణం
బేమైపోయెననర్ఘవస్త్రనివహం బెందుండెనో యక్కటా

యామున్ ద్రాక్షఫలహారము లడిగెనెందా భామ లేమయ్యెనో
యేమందు సకలంబు నిక్క ముగ నా హేమాంగికిం జేరెనే ౨౫॥

మ. అకటా యెంతటి కల్లలాడితిని నాహస్తంబుతో నేను దా
నికి నేమిచ్చితి నంతె కాక మనయింటం గొల్లగా దోచెనే
ప్రకటంబొప్పగ మస్పితృప్రాణములకున్ బాలయ్యె మువ్వంతుగ
న్సకలార్థంబుగ నిచ్చినన్ దొరకరా చంద్రాస్యకీడౌ సతుల్ ౨౬॥

క. ఏమైనం గానిమ్మా భామామణి విడతు నేనెఁ బాపము వచ్చున్
నామీఁదన్ మనసుంచుచు నేమానిసి నైనఁ గంటనీక్షింపదు గా ౨౭॥

గీ. మునుపఁటి గౌరవము డిగెం గన కాంగికిఁ దల్లి కేమి కారణమొకో
మనకు వ్వారికి భేదంబును గల్గునె గౌరవం పుపొర లేమిటికిన్ ౨౮॥

వ. అదియునుం గాక ౨౯॥

ఉ. త్యాగము తగ్గుచున్న యెడఁ దగ్గక యుండునె వాని వెంబడిన్
రాగము చంచలాక్షికిఁ దరంబె పాటియొగా దెలియుట్టువ
రాగమ వేళలందటిను లప్రతిరోధము గాఁగ వచ్చునా
భోగము గ్రీష్మకాలమునఁ బొల్పతి పోవక నిల్చియుండునే ౩౦॥

ఆ. తండ్రి డినన్ను మాన్పఁ దలఁచియోపక పోయె నాఁడు దాని మాటయంతకన్న
నధిక మౌనె యింతయర యుంగ నేటికి వనియ ధా పురంబు గనుజరించె ౩౧॥

క. అటులుండఁగ నగ్గణికా కుటిలాలకఁ జూచి తల్లి గొణుఁగుచు మననెనీ
విటు సంసారిణి వలెనొక విటుతో నుండంగ బ్రతుక వెర వేమియగున్ ౩౨॥

కవిరాజవిరాజితము.

కనఁబడెఁ గాయలు రాల్చిన మామిడి కైవడిఁ గేవరావతఁడి
చ్చునె పరహాలను గోకలు మాదలు సొమ్ములు నేమని వానిపయిం
గొనకొని మక్కువ వీడక యుంటివి కోయనఁ గోటివిటుల్ గదయే
పునని తఁడంపొకఁడొకటు గాదొకొ పుస్తెనుగట్టె నె కంఠమునన్ ౩౩॥

సీ. పల్లవరాగంబు పలుగప్పఁగనకున్న బల్లవరాగంబుఁ బడసినగునె
నీవినోదము లెల్ల నెరపక యుంటివా నీవినోదము జేయు త్రోవగలదె
పలురూపు గాన్పింపఁగిలకిలన్ గనకున్నఁ బలురూపులను మాయఁ బరపు టెట్లు
తియ్యని మాటలఁ దేల్చక యున్నచోఁ దీయనీ వశమౌనె ధీరు మనసు

గీ. ఈపటుల సేయకుండినఁ దుందువదన యేవిటులు నిన్నుఁ జూతురు భావమలర
గానవమ్ము ము నామాట కానవమ్ము వెన్నెలవు గావు సుమ్ము నీ వెన్నెలవున

సీ. ఒకనితో మాటలనొప్పగా నాడుచు నొకనిని వేగలోనికినిఁ బిలచి
యొకనితోఁ బరిహాసయుక్తులు సెప్పుచు నొకనికిఁ గనుసన్న యొనరఁజేసి

యొకనికి వీడెంబు నొసఁగు నంతనొకనికి నవ్వుచు మొకముఁ జూపి
యొకనితోఁ బ్రాణనాయకుఁడ వీవని చెప్పి యొకనిపైఁ గోపంబు ప్రకటపరచి
గీ. యొకనితో నిన్ను విడియుండ నోర్వ ననుచు నొకనితో రెక్కయుఁ బూర్తి సేయక యొవారి
చేతఁ గలరొక్కమంతయుఁ జేరఁ దీసి పంపదే నియ్యది యేటి పడఁపు పాలఁతి ౩౫॥
క. కొంటెతనంబులు వెలజా, ల్గంటికి జన్మంబుతోడఁ గల్గవలెం గా
కంటు నెచెప్పిన మాటలు మంటికి నెవ్వండు సెప్పె మోసపై వాఁడిన్ ౩౬॥
క. కావున నెవ్వని కాపుర మేవిధమునఁ జెడిన సంశయింపక వేవే
వేవేలు చేర్పఁగా వలె వేవురు విటులకు నాగిటుకు వెట్టఁగ వలయున్ ౩౭॥
వ. ఒక్కనాఁడు నీయందనురాగంబున డప్పుల్యాటీక లెక్కరయియున్న నాయఁడుగారు
వారంబంపియుండిరి నీవప్పుడు మేళంబునకుం గ్రామాంతరమందుండుటం జేసి
వారియుద్దేశంబు నెరవేరదయ్యెం గావున ౩౮॥
ఉ. ఆయత విత్తవంతుఁ డుయశోధికుఁ డున్న కలాధికారియున్
నాయఁడుగారు నీపయి ఘనంబుగఁ గామముగల్గి వాతఁ డలం
బాయని వేడ్కఁ బంపెను నభాగ్యమిఁ కేమని చెప్ప వచ్చు నా
రాయణశాస్త్రి నంపి నరయంబున వచ్చునటంచుఁ జెప్పినన్ ౩౯॥
క. ఆ స్త్రీరత్నంబతనికి శాస్త్రింబిలువంగఁ బంచి చాతుర్యమునన్
వస్త్రాదిభూషలన్ మరు శస్త్రంబనఁగన్ను గవకు సమ్మద మొసగన్ ౪౦॥
చ. జలజలలాడు పెన్నెరులసంపఁగి నూనె మెఱుంగు వెట్టి బల్
కలకలలాడు సోఁగయగు కన్గవఁ గాటుకఁ దీర్చి నిద్దమై
మిలమిలలాడు రంగుపని మించె సుపావడఁ గట్టి దానిపైఁ
దలతలలాడు నొక్కజలతారు బనారసు పైటఁ జేర్పఁగన్ ౪౧॥
క అయ్యింతిఁ జూచు వేడుక నయ్యుద్యోగస్థుఁ డధిక హర్షంబునరం
దయ్యవిలుకాఁడు దరుమం జయ్యనఁ జయ్యనననంగఁ జూముచు నడ చెన్ ౪౨॥
శా. ఈ లీలం జను దేరి నాయఁడపుడా హేలావతిం జూచుచున్
బాల్యారత్నము తోడ నేవిధమునన్ భాషించెనో దాని ప్ర
శ్నాలాపంబుల కేమి యుత్తరము దా నందిచ్చెనో దానితో
నే లీలన్ విహరించెనో యెఱుఁగఁ డా యొంజిత్రమా నెంచఁగన్ ౪౩॥
మ. పవలుద్యోగపు కార్యముల్ వడివడిం బాటించి చన్నారసైం
ధవము లందగ తింజరించు మనుచుందరింౘ నా భామతో
నవహేలారతిమందమందకృతులన్ వర్తించి చిన్ రేయి తా
నవలీలం జను నంచు నెంచు మనఁట నాయండద్భుత ప్రక్రియన్ ౪౪॥
క. పలుమారు నాయఁడీగతి లలనారత్నంబుతో విలాసము సలుపన్
వెలవెలఁ బారుచు మదిలో నలకేశవరావు చింతనందం దోడఁగన్ ౪౫॥

ఉ. అమ్మనఁ బాలు ద్రావితుదఁ బొమ్మన గుద్దుదురన్ని భంగులన్
నమ్మగ రాదు హారలల నామణులన్ మును దండ్రి చెప్పె మా
యమ్మయు నింతిబంధువులు నాప్తులుఁ జెప్పుచు నుండిరిన్ని యున్
సమ్మతిఁ జేయనైతి నవిసత్యము లైకనవచ్చె నీయెడన్ ౪౬॥
గీ. బ్రాహ్మణునిఁ గాని పోఁదరన్ పలుకువోయెఁ గులసతికి బోలె భర్త నాకునుఁ గండ
మనుమనుడువు లెల్ల నున్న యయ్యోరుద లంప నిన్ను విడఁజాలననుమాట నీటఁ గలసె ౪౭॥
క. అంతటి సంసారము నా కింతటికి న్వచ్చె నీని నెంచయుటచేనీ
చెంతకుఁ బోయినవారిం బంతంబున నెవరు పట్టి పల్లార్చిరొకో ౪౮॥
చ. గతమున కీగతిన్ వగవఁ గార్యము గల్గునె నాకు దీనిపై
మతి విడఁ గుం డెనిప్పుడు సుమానఁగఁ జాలనుడ నిపొందు నా
కితరవధూటులప్సరసలే నియుఁ జిత్తమునందుఁ బట్టరా
చతురతయా విలాసములు నా మృదురూపము నెందు గల్గునే ౪౯॥
ఉ. ఎంతటివారు గోరినను నెన్ని ధనంబులనిచ్చిరేని యా
వంతయు వారిపై నిమనసంటి కూరిమి గల్గనేరద
కాంత కునిశ్చయంబు ధన కాంక్ష మొయిన్ వివరించిఁ గాక త
త్స్వాంతము నన్నుఁ బాయదిఁక దానె వరించిన వాఁడ నౌటచేన్ ౫౦॥
ఆ. నాయఁ డుండె నేమి నాస్నేమి భ్రాంధించెఁ గానదీని విడువఁ గాదు నాకు
ననుచు మనసు ద్రిప్పి లోనియోగముగుండు వారకాంతవలపు వంచదేవని ౫౧॥
క. నాయఁడు క్రమక్రమంబున డాయుచెలికిఁ గేళపురకు రూఢిగ నెపుడుం
బాయనితమకము గలదని చేయవలయు నేమటంచుఁ జింతిలె నుమదిన్ ౫౨॥
సీ. తప్పలేకున్న నదడవియా ఫీసులోఁ బోసఁగనిమాటల విసువు ముండుఁ
గనకాంగి పొందు వద్దని పరోక్షంబుగాఁ బెరవారిచేతఁ జెప్పించు చుండు
లెస్సడి పూర్యాటీక లెక్కరుని నన్నుఁ గోపించు నేమనియనపించుచుండుఁ
నడరి పాటునఁ ద్రోవ నెదురైన విడువక ముఱుముఱు చూపులఁ జూచుచుండుఁ
గీ. గేళపునిమీఁద నాయమకిసుకఁ బోడమి చేయఁగలచిక్కులెల్లను జేయఁ సాగె
నేకఫలకాంక్ష గల్గిన వెంతవారి కైనఁ గలఁతలు బోడముటయుద్భుతంబె ౫౩॥
చ. ప్రబలవిరోధమివ్వరుసఁ బైఁబడి యొన్ ధనహానిసంభవిం
చె బలగ పుంజనుల్ దరిని జేయరి రైన నుపీడఁ జాలఁడ
య్య బలను రామదాససుతుఁ డౌర పయోరుహసంభవుండు వా
రిబిసరుహాక్షి మోవి మధురత్వముసీ్వయులమోవినుంచఁడో ౫౪॥
చ. సరసపు పల్కులవ్వనితసల్పుచుఁ గేవలవృత్తి వోడని
బ్బరముగ నుండి యుండియును బాలు వనాయడు గారి నెన్నుచున్
వరగుణుఁడచ్చరూపుఁడని వర్ణన సేయుచు నాతఁ డిచ్చునం
బరములు సొమ్ములున్న గలుమాటికిఁ జూపుచు సంతసిల్లెడున్ ౫౫॥

ఉ. తోయరుహాస్యకేశవునితో విహరించు మనంతలోపలన్
హాయిగ నాతఁడున్నతఱి హాయిటకెవ్వరొ వచ్చుచుండిరా
నాయఁడుగారిమాటలు వినంబడె నల్లదె యూరకుండుమా
పాయుట మేలు లేదిఁక యుపాయమటంచును దిక్కులారయున్ ౫౬॥

గీ. ఆరసాభాసమే మనియనగ వచ్చుఁ గేశవుండంతలోపల గినుకభయము
నేవయును గిందులాడంగ భావమెఱియఁ జేయుపని లేక యిట్లని చింత సేయు ౫౭॥

చ. హరహర యేమి చెప్ప వెలయాండ్రు కృతఘ్నులు నేనొసంగునం
బరములయూరు పేరులును మానె నెసొమ్ములడంగిపోయె నే
సరసవిహారముల్ మిగులఁ జప్పనివయ్యెను నేటికీక లె
క్కరుసు గుణుండు దాతయనుగావలసెంగద కాలమెట్టిదో ౫౮॥

ఉ. చక్కెర నోటయున్నతఱి స్వాదువుగాని కఱంగియంతలో
గ్రక్కన మ్రింగినట్టి రుచిఁ గానఁగ వచ్చునె యట్టిరీతి నీ
కక్కసపుంబొలంతులకుఁ గామితవిత్తము లిచ్చునప్పుడే
మక్కువ గాక యీగి యొకమాత్రము తగ్గిన మోముఁ జూతురే

మ. అనిచింతించఁగ నింగితంబెఱిఁగి వేశ్యామాతయున్ వేగ నా
తనితో నిట్లను నయ్య యీపనికి నై తప్పెన్నఁ గాఁబోకుఁడీ
ఘనుఁడుద్యోగియటంచు నొప్పవలసెం గాకున్నఁ గోపించునో
యనసత్యంబని యెంచి బాలిశతబూర్వాకారుడై యుండఁగన్ ౬౦॥

క. వానిం దొలగించెడు వెఱ వానాయఁడు దలఁచి వీనికపకృతిఁ బోలెం
గానఁగ రాకుండంగా నేనొకటియొనర్తునను మనిశ్చితమతియై ౬౧॥

ఉ. ఈతరుణీలలామ నితఁడెన్నఁడు వీడక యుండె దెవద్దన్
నీతియుఁ గాదు చేయగల నేర్పులనెల్లను ముందు జేసితిన్
జీతపువృద్ధి పైన తనిఁ జేసెద ట్రాన్స్ఫరు వేయుచోటికీ
భూతము దీనితో వదిలిపోవునటంచొనరించెనట్లుగాన్ ౬౨॥

కేశవరావును బదిలీయొనర్చుట.

వ. అట్లా కేశవరావుం బదిలీయొనర్చిన నాతండును నాయండొనర్చిన కపటంబునకుం జింతించుచు నకటా ముందువచ్చిన చెవులకన్న వెనుకవచ్చిన కొమ్ములు వాఁడి యన్నగతి నీతండు నన్నుఁ దొలగించి కనకాంగి నాక్రమించెనే యని చింతించుచు

ఉ. వద్దనజాలవేతనము వర్ధిలుచుండఁగ వీఁడజాలన
మ్మద్దియ నేమి సేతు నెటఁ బోదునటంచొకకంట దుఃఖముం
దద్దయు నొక్కకంటను ముదంబిడి దానినిఁ గౌఁగలించియో
ముద్దులగుమ్మ నన్మరువఁ బోకుము నేనటఁ బోయివచ్చెదన్ ౬౩॥

వ. అనవుడు. ౬౪॥

క. బుడిబుడిఁగన్నీరెగతిఁ బొడమెనొ యన ప్రియుఁడ వచ్చిపోదువు గాక
ప్పుడపుడటంచుం దద్ధన ముడుఁగక కొనుతలఁపుఁ గలిగియోరం జెప్పెన్. ౧౬॥

చ. అతఁడును గొంతదవ్వుగలయన్నగరంబున కేగియప్పనిం
జతురతఁ జేయుచుండి దివసంబులు మాటికి లెక్కఁ జూచుచుం
బ్రతిరవివాసరంబునను రైలుపయిం దగ వచ్చియింతికై
యతిశయమైన వేతనములవ్వది రూప్యము లిచ్చి నిచ్చ చేన్ ౧౭॥

ఆ. ఒంటిపొద్దుభుక్తియును భోగహీనత. భానువాసరమునవ్రతము సాకు
ననిక లెక్కనుండ కుహద్దు చెప్పి పొలంతి కేశవాఖ్యుఁ గాముకేళిఁ దేల్చు ౧౮॥

కేశవరావు కనకాంగికి తనమీఁద ప్రేమగలదనుకొని సంతసించుట.

ఉ. పాపయిఁ గూర్మిచేసుదతి సాయనితోఁ గపటంబు సెప్పినం
జాపఁగలేదు సంతసమహర్నిశముందనయంబుఁ గూర్మిచే
నోపణమందుఁ గూర్మియగునో నివరింపఁగఁ జాలఁడయ్యెను
న్నాపదిమాత్రమిచ్చునపుడందిన గౌరవముం దలంపఁడో ౧౯॥

క. ఇటు సుందరి నాయని చెంగట మిక్కిలి ప్రేమ్మిఁ జెందిక్రమమున నతనిన్
మటుమాయలఁ బన్నుచుఁ దన పటమున ముడివేసికొని యొఁబ్రజ్ఞావతియై ౨౦॥

సీ. ఎంతశిక్షాపాత్రుఁ డేనియుఁ దనహితు నించుకలో విడిపించుచుండు
నెంతయనర్హ్యవకేనియుద్యోగంబు నించుకలోనఁ జెప్పించుచుండు
నెంతదుష్కరకార్య మేనిలంవఁ దనకుఁగొని యించుకలోనఁ జేయించుచుండు
నెంతమహాత్ముఁ డేనియుఁ దనవైరి నించుకలోఁ గణపించుచుండుఁ

గీ. బలువురీయింతి నాశ్రయింపఁగఁ దొడఁగిరి కలికికిసుకసుసైగ జగజవడఁకిరి
చానచాతుర్యమగ్గింపసాగిరపుడు దానిభాగ్యంబువర్ణింపఁదరమె శర్వ ౨౧॥

క. కోవెలఁదికి నెలజీతముఁ గావించెం గేశవాఖ్యకిరణికిన్ సర్వం
బీవేయనఁడదియధికం బీవేయనదతఁడు జెందఁడీవేడుకయున్ ౨౨॥

క. ఈకరణి నుండ నచ్చట నాకేశవుఁ డొందివ రమస్తమదినముం
దే కాకనచుమనదుమన్ రాకుండెని దేహియను చురగులుచునుండెన్ ౨౩॥

సీ. నీలముల్ శుద్ధశైవాలములైడవిల్లు జాలముల్ ముంగురుల్ మాకలమంటఁ
జెండులై బంగరుగిండులై దానిమ్మ పండులై గుబ్బపాలిండ్లుల దరఁ
దూఁపులౌ మన్మథుపాపులోయెలదేఁటి రూపులోయనఁగ వాల్జూపులమరఁ
దారమై నిల్చు సింగారమై పూవిల్లు సారమై సుందరాకారమొప్ప

గీ. నడుగడుగునందుఁ దడబడి బెడఁగుఁ జూపఁ గిలకిలనునవ్వ మొలకలు వలపుఁ దెలుప
వచ్చియచ్చెలి మెచ్చుచు హెచ్చిగ్రుచ్చి కౌఁగలించెడి భాగ్యంబుఁ గంటి నెపుడు ౨౪॥

క. చుఱుకు మిఱుకుక్కన మోవిం గొఱుకఁగ నీకింత దురుసుగూడు నెయనుచుం
గొఱకొఱలాడు మనంత నె మఱిమఱి నుఁ గౌఁగలించుమానిని నెంతున్ ౨౫॥

## కనకాంగిదలంచుకొని కేశవరావు చింతించుట.

సీ. ఆవేళఁ బూఁదోఁటయలరుగాడ్పులు వీవ సౌధతలంబున సంచరించె
నానాఁడు మధురోక్తులాడుచు సరసను గుదురైనగద్దెపైఁ గూరుచుండె
నాపొద్దు ననుదలయంటెనీరాగంగఁ జెరలాడుచును సోగనెరులు విప్పె
నాసమయంబున నందంబుగా వీణ మీటుచు మగళీలబాటఁ బాడె
గీ. అప్పుడీచర్య లెల్లను నమృతమయ్యె నిపుడు మదిలోనఁ బొడకట్టి యేచుచుండె
విసముపోలిక నేమియు వెరవుదోప దేమి సేయుదుఁ బ్రాణంబు లెట్టు నిలచు ౭౬॥
క. నాభాగ్యము నాముల్లియము నాభవ్యతపఃఫలంబు నాపుణ్యంబున్
నాభూరిరాశియహహా శోభావతి నయ్యతండు చూఱంగొనియెన్ ౭౭॥
గీ. ఉవిదతోఁ బొందు నాకు లేకుండె నేని గ్రామమున నున్ననిత్యముఁ గనులఁ గాంతు
మోహమున వైచె వాఁడతిక్రూరుఁడగుచు ననుచు దలఁపోసి వెతఁ గుందు ననుదినంబు ౭౮॥
సీ. సారంగమోమత్తసారంగమో కాదె యతివకుఁ జూపులు యానములును
మాకందమో శ్రీరమాకందమో కాక విమలాంగి పల్కులు వీనుగవయు
వాలంబులో ధేనువాలంబులో యారు చానకుఁ బెన్నెరుల్ జంఘలరయ
సరములో తారాసరములో కావచ్చు నలినాక్షి బాహువుల్ నఖరములును
గీ. అనుచు వర్ణింపఁదగినట్టి హంసయాన స్వప్నమున నైన మరువంగఁ జాలకుంటి
నెవరితోఁ జెప్పకొనియెద నేమిసేతు సమయమును వేచియేచఁగ సాఁగె మరుఁడు ౭౯॥
క. ఇవ్విధమున నొకవత్సర మవ్వనితకుఁ గుఱుఁడు లాభమందు వసించెం
జివ్వన ద్వాదశరాశికి నవ్వరుసం జేరకుండు నాతలపోయన్ ౮౦॥
మ. ప్రకటంబొప్పఁగ భానువాసరమునన్ భర్త్రాంగిఁ బొందంగఁద
ప్పక యా కేశవరావువచ్చెను మంబల్లాఱువాదంబుతో
నొకకర్ణేజపుఁ డాప్పుఁడై తెలుపఁగా హుంకారముం జేసి నా
యకుఁడా రాతిరి గద్దరించి పిలచెన్ ద్వారంబు చెంతం జెలిన్ ౮౧॥

## నాయకుఁడురాగా కేశవరావును కనకాంగి తలుపుచాటునదాచుట.

క. పిలచినఁ గేశవుఁ డుడొక తలుపు వెనుకడాఁగి చనఁగ ద్వారముఁ దెరువన్
నలుప్రక్కలరసి నాయకుఁడు చెలువయతండెవ్వఁ డొక్క చెప్పుమటన్నన్ ౮౨॥
శా. ఆయయ్యా యెన్నఁడు రానివాఁడితఁడు నేఁడాదిత్యవారంబటం
చియ్యారం జెలికాండ్రఁ జూడ మటకుం నైయేతెంచి మాయింటనుం
న్నెయ్యంబుండుటఁ జూచి పోవఁ దలఁచెన్ నేఁ డేవడింబోవునాఁ
డయ్యెం గావున రాత్రివచ్చె ననఁగా నాతండు కోపంబునన్ ౮౩॥
చ. పటపటఁ బండ్లు దీటుచు మనంబున నీకు సద్వ్రతం
బటె యిది తొత్తుదుష్టవెలయాండ్రగు నీతియు జాతిఁ గల్గునే

యటులిటులాదరించితిఁగదా యదియంతయుఁ గాలిఁబోయె నే
పటువిభవంబుఁ గుక్కకిడఁ బైజనియాకులు నాకకుందు నే ౮౪॥
ఉ. పాఁపఁడవంచు నీదుపనిఁ బట్టకయుంచితి నిన్నినాళ్ళు మా
రాపలు గాకి నీదగు మకాము విడన్ సెలవివ్వఁడిచ్చె నీ
లోపము తెల్లనోరుచుటలాంగకయుంటివి మీరు స్వేచ్ఛగా
నీపయి నుండవచ్చునననింతియుఁ జాపయిఁ బల్కిరంతటన్ ౮౫॥
గీ. తప్పొనరింపనిదండన మెప్పుగు నేమీరు కోపముడుగుఁడు మీరే
తప్పుసహించనియెడ మే మెప్పగిదిన్నిల్లవచ్చు నెంచుఁడటన్నన్ ౮౬॥
ఉ. జీతము వృద్ధిఁ జేసితినిఁ జేయఁగఁ గూడని తప్పులెన్నియో
నోర్తలపోయకుంటి మునుపున్నది నేఁ జెడఁ జూతు నేనియున్
నాతర మేమ యల్పుటకు నాకును నీజనకుండు మిత్రుఁడం
చీతఱి నోర్చియుంటి నని యేగెనతండు స్వగేహసీమకున్ ౮౭॥
ఉ. అప్పురుషస్వభావుఁ డుదయామతిదూరముఁ జూచువాఁడునై
యిప్పగిదిన్ సహించెనని యెంచఁగ వచ్చునె నిశ్చయంబుగా
నొప్పులకుప్పపైన తనకుండెడు రాగము వానిచిత్తముం
జప్పనఁ ద్రిప్పె నేర్పుగల సారథి దుష్టహయంబు నుంబలెన్ ౮౮॥
ఆ. అతివయందుఁ గల్గు ననురాగ మతనికిఁ బూర్వమార్గమున నెపొదలఁ గాని
రాచకార్యములను రమణికిచ్ఛాగతి జేయఁడయ్యె మనసు చెదరుకతన ౮౯॥
చ. అరఁగులపైనిఁ గానఁబడ రాత్రి తులెవ్వరు లంచమిచ్చువాఁ
డరుదయితో మెచుం డెవిరయంబున మాటపచిరము వారలున్
దొరకక యుండిరచ్చెలికిఁ దొత్తువకున్ శిపమెత్తె నేనియుం
బరగఁగ మొక్కు దప్పదని పాటియొనర్చిరి పూర్వమాత్రియన్ ౯౦॥
క. అతండోసఁగుచునుండెడు జీతము గాకొక్కగవ్వ చేతంబడమిన్
నాతికి నాయఁడు భారం బైతోఁ చెంబరులరాక కడ్డంబగుటన్ ౯౧॥
ఉ. మానక యుండెఁ గేశవుఁడు మానిని యింటికి రాకపోకలన్
సానియు నాతనిన్ విడువఁజాలక యుండె ధనంబు పైరుచిం
బూనిన యట్టి పంచశర భూతముఁ ద్రోయఁగ నెట్టియాజ్ఞయున్
లేని దినంబునందు రమణీమణి చెంతకు వచ్చియుండఁగన్ ౯౨॥

## నాయుడు కేశవరావునకు బర్తరపు వ్రాయుట.

ఉ. దైవవిధాన మెవ్వరికిఁ దప్పఁగ శక్యమె నాయఁడంతలో
నేవిధినో యావేళఁ జెలి యింటికి వచ్చి హఠాద్గతింగనెం
దీవియబోడిఁ గేశవునిఁ దెల్లము గానఁబడెన్ని భంగులం
బోవుచుటన్న శిల్పకగిరుక్కనమ్ము మహాగ్రహంబునన్ ౯౩॥

ఉ. చేతఁ గలంబుఁ గొంటి యవశిష్టము గాఁ గఁదలంచి యప్పు డా
రాతిరి వేళ బర్తర ప్రవాసిని శాంతము గాక మున్నె య
త్యాతత వృత్తిఁ గేశవున కంచిత దాదిగ నెన్నఁ జేని యున్
కొంతె తెలివంగ నుం గొనుటకో తయటంచుఁ దలంచె నాత్మలోన్ ౯౪॥

గీ. నాటి సుదతిఁ గేశవుండును నాయకుండు నిదురచూచుం డెను నంతవలుఁ డిఁ గె గాన
బెట్టె లోవిత్తములు వ్యయ పెట్టుటకును జేయి సాఁగక యుండె నెప్పేలు వకపుడు ౯౫॥

ఉ. ఆకొని యున్న యట్టి నరుఁ డంబలి యేని యుఁ గంజి యేని యుం
బాకము గాని దేని యల వడ్డ యెడం దినఁ గోరు పోల్కఁ గా
నాకలకంటి యున్ వసు సమార్జన తృప్తి జనింపకుండుటం
గోకయొసంగు జానికినిఁ గోరికఁ దీర్చె గ్రమక్రమంబునన్ ౯౬॥

క. హేమాంగిమణి నిద్దపు సామ్మైంజాతమను చుముచ్చట పదుపా
రాముద్దియ గృహమునకున్ వేమారున్ వచ్చి పోవు విటులైరహాహా ౯౭॥

మ. సరజస్తంబున బుట్టి నిట్టిఫలమా సారీమణీ వాక్సుధా
సరసీబిందుకణంబుఁ గర్ణముల నాస్వాదింపనా భాగ్యమున్
దొరకన్ ధన్యులమౌదుమంచు మదిలోఁ దూఁగాడు వారెల్లరుం
బరిహాసోక్తులఁ బొంకనట్టి విలసద్భావీణ్యులైరింతికిన్ ౯౮॥

మ. జనుపాపంగ పెకంటిఁ గాంచు మదిన్ సందిగ్ధలో వారలే
ఐడి గా వచ్చి సరోజనేత్ర కది యోపాక్రుద్వఁ గాంచి తసా
నుడికిన్ మాట్లాడి నించియొంచినుడు వన్లాడుచున్ నవ్వుచున్
దడవన్ స్ఫోటనె యుంటపాఁగిర హాహా తద్బుద్ధ చేత సుకై ౯౯॥

సీ. ఎడకాండ్రు గావచ్చి గుడగుడలాడుచు నతివతోఁ బరిహాసమాడువారు
ఘల్లుఘల్లు మనంగఁ గరమున రూప్యంబు లెగర వేయుచునుండు సొగసుకాండ్రు
ఒక్కనిద్రకు నెంత యుంకువ యైనను నిచ్చెదమను వన్నెకాండ్రు
తామరసాక్షి రో సాటకేమి యిచ్చు తరమని పలుమరు దరచువారు

గీ. సంతతాటముగఁ గూడి యింతి యింట వార్త్య తలమునఁ గొందలు వంగణంబు
నందు గొందలు నరఁగులయందు గొంద లాకులంబుగ నుందురహర్నిశంబు ౧౦౦॥

క. ఆచాతుర్యం బేమన వాచాగమ్యంబు గాదు వచ్చెడి విటులం
దాచము బరస్పరంబుం గోచరముం బొందకుండఁ గొనసాగించున్ ౧౦౧॥

వ. అట్టియెడం గేశవుండు కోమలాంగిని విడువంజాలక యక్కటా దొక్కంబు తక్కువయయ్యె నిక్కాంత పయి మక్కువ యక్కరణిని పెక్కు చిక్కులఁ బెట్టుచుండె వీండ్రు నన్నుం దృణంబునకన్న లఘుతరంబుగాఁ జూడం దొడంగిరి చెప్పెలువయుఁ బణ్యవీధిన మరించిన క్రొమ్మావి పండయ్యె నైనను దొల్లింటికై వడి వచ్చుచుం బోవుచుండెదనని తలపోసి ౧౦౨॥

## తనయందు కనకాంగికి గౌరవము తగ్గినను కేశవరావు విడువకుండుట.

క. ఒకనాఁడు తలుపుదీయక యొకనాఁడు గృహంబునఁ గునుఁ డిరిఘుతులం
చొకనాఁడు రేపురమ్మని కిసరించఁగ సాగిరపుడు కేశవరావున్ ౧౦౩॥
క ఆట్టియెడఁ గేశవాఖ్యుం డిట్టు మఁబలుమాఱు పాపతీవ్రామర్షం
బుట్టిపడ నాఁడెవి దెనా పట్టియకట నీవు నెంత పైపైనం డెక్ ౧౦౪॥
ఉ నీ మఁడ యెన్ని సారులిటు నీకువచింపితి సిగ్గులేదె సం
కోచ మొకింత లేదమున కుంజవియింపదె మాగృహంబునం
దాచఁగఁ బెట్టినావఁటర తాతల నాటిధనంబు సర్వమున్
నీ చెలిమింగదా యిటు మునింగెను మా ధనలాభమంత యౌక్ ౧౦౫॥
ఉ. కాసులు దెచ్చినావొ కనకంబులు దెచ్చియొసంగినావొ కో
వీసము నైన లేదు గద వెచ్చపుసాని యొకాదొ లేక నీ
కోసమె యుందునుం డెనొకొ కొంటివొ మా కనకాంగి దుర్మతీ
నీ సరి వాఁరి జూడవెయ నేక ధనంబులనిచ్చుచుండరే ౧౦౬॥
సీ మీపీఠసన్నిధి నీపాంసురమ్ములు సానికి రత్నభూషణములౌనె
మీ మంత్రపుష్పముల్ మీపూజనమ్ములు గణికామణికి నేమి కనకమౌనె
మీ మడివల్వలు మీ సదాచారముల్ వారకాంతకు జరీబట్టలౌనె
మీ యిచ్చు దక్షిణల్ మీ యన్నదానముల్ జక్కఁగా వేశ్యకు రొక్కమౌనె
గీ యీయఁగలిగిన వేశ్యల నెనయవచ్చు నీయలేకున్న నవ్వలి కేగవచ్చుఁ
బ్రాప్తవయొ నచ్చి మిమ్ము రమ్మందు రెవరు పదపదగదయ్య కబురులు పనికిరావు ౧౦౭॥
సీ. పైడిపువ్వుల పూజఁ బఱగించుమన లేదు గురుతర రత్నముల్ గోర లేదు
నిలువు ధనములు గలిగింపుమన లేదు లక్షలు దెమ్మని లాగ లేదు
గ్రామంబులిమ్మని ప్రార్థించఁగా లేదు భూములిమ్మనుచును బోర లేదు
వెలలేని తొడవులు వేఁడుటయును లేదు మొహారీలు దెమ్మని మూల్గ లేదు
గీ. యిచ్చితివొ లేదొ మాకు నొక్కింత సొమ్ము మిగుల నొసఁగిన పోలిక నెగసిపడెద
వెల్లవారలఁ జూడవే యిల్లునిండ విత్తరాసులు వోతురు వేశ్యలకును ౧౦౮॥
సీ. పొమ్మని పలుమాఱు పోరి చెప్పినఁ గాని యీడిగెలంబడె దింటిపంచ
వద్దువద్దని చెప్ప వాకిటియరగుపైఁ బవ్వళింతు చెద్దనంబు లెక్కదవుర
తలుపుఁదీయనటంచుఁ దెలిపినఁ బోవక బ్రతిమాలుకొందువు పలుతెఱఁగుల
సమయంబు గాదని చక్కఁగాఁ జెప్పిన దోడదోడ లోనికిఁ దూఱుచుందు
గీ. పోరనిన్నెన్ని కంకిననోరునొప్పి నీరమణి నెవ్వరికి నైన దారవోసి
వచ్చితివె వేఱుగతిలేక వారకాంత పొందు నీబోటి వానికిఁ బొసగునటర ౧౦౯॥
గీ అప్పుడప్పుడు మా యొద్ద నప్పుగొంటి వేయువందలు వడ్డితో నెంతయగునొ
యిల్లు వాకిలి యోయమ్మి యియ్యవేని యట్టిపత్రము నీపనిఁ బట్టుకున్న ౧౧౦॥

గీ. అట్టులు బల్కుచునుండ హేమాంగి వచ్చి తల్లిపైఁ గద్దరించుచుఁ దగవరితనెఁ
బోటి సేయకుఁడీ వృద్ధమాటలనుచుఁ గొంటెతనమున నాతని నింటి కనిచె ౧౧౧॥
శా. ఆరామామణితల్లి కేశవునకుం బ్రారంభమందుల్లస
న్నీరంబై కరకంబునై హిమఘనస్తోమంబునై మౌక్తికా
కారంబై శశికాంతమై స్ఫటికమై క్రంబైన వజ్రంబునై
ధారాళంబుగ వానిమీఁదను తుదం దర్కింపనావాటికిన్ ౧౧౨॥
వ. అతండు నిజగేహంబున కరిగి యొక్క వేదికపై నుత్తరీయ చేలంబుం బరచి పవళించి భూతావిష్టుని తెఱంగున సొమ్ముపోయినవానిపగిది బ్రహ్మహత్యఁ జేసినవానికైవడి రాజదండనంబున కలవడినవానిచాడ్పున వృశ్చికదష్టునివిధమున నేమియుం దోఁచక యిట్లు చింతింపఁదొడంగె ౧౧౩॥

## కేశవరావు తనహీనదశకుఁ జింతించుట.

ఉ. అందఱునన్ని చెప్పవిననైతిని మున్నొకయప్పుడైన నీ
కొందలమందనాకిపుడు కూడునె నీరము లెల్లఁ బోవఁగాఁ
దొందరఁ జెంది సేతువిడుదుర్మతి నైతిని చెప్పవారలే
పందలుగాక చెప్పటను వచ్చెదరే నను బోటిమూర్ఖులతోన్ ౧౧౪॥
ఉ. కేశవరావుగారనుచు ఖేలనమాడిరి వీండు ప్రిమున్నగాఁ
గేశవరావటంచుమతి కేళి మఁ బల్కిరి కొన్ని వాళ్ళకుం
గేశవుఁడంచు నాపయి నికేరడమాడిరి నాడు నాటికిం
గేశవటంచునన్ను నిరి కేవలవిత్తకృశత్వరీతిచేన్ ౧౧౫॥
ఉ. ప్రత్యహమింతసొమ్ము తనపాణితలంబునఁ బెట్టకున్నవై
యాత్యముఁ జూపి ద్వారమున కడ్డము దాకుచు నెన్ని చెప్పినన్
వ్యత్యయవాక్యముల్వలికి యవ్వలికంపుచుఁ బాపియుండ పా
పాత్మ్యముమాచరించు వెలయాండ్రరతుల్ నరకంబెంచఁగన్ ౧౧౬॥
శా. హాలాపానవిలోలచేష్టుఁడగు మూర్ఖాగ్రేసరుల్మెచ్చుఁడా
బాలల్ తల్కుముఁ బూనినన్నిట్లుల ద్రిప్పంబాడియే యెంతయో
కాలంబయ్యె నటంచు లోఁజని బలాత్కారంబునం బట్టియు
ద్వేలప్రక్రియ నిచ్చదీరనడఁచెన్ వేణీసమాకృష్టిచేన్ ౧౧౭॥
సీ. సౌరనారులతీరు నారఁజేయుచునుండు సౌరుతో జాప్తాణజారుతోడ
హెచ్చియచ్చరమేలి మచ్చెకంటులఁ ద్రచ్చు తీరుతో క్షత్రియవీరుతోడ
నిక్కు జక్కులతళుక్కు చెక్కు కల్కులఁ దొరకు నీటుతో మేటికి రాటుతోడ
పాఁపపాపలకొపురూపు మాపఁగనోపు నేపుతో నొకగొప్ప కాఁపుతోడ
గీ. చెలువుదళుకొత్తబలుకొత్తసిరులతోడ నందటికినన్ని రూపులైయమరు నేర్పు
గలిగి మెలఁగెడునల వెలకలికియూర దానిమాయలు దానికే తగును మహిని ౧౧౮॥

సీ. పరవంచనా ప్రీతిభాషకులు వాక్కులు దుష్పథవర్తనధుర్య చర్య
అఘసంచయాలంబయష్టులు దృష్టులు బహ్వసత్యోక్తిస్రువా జిహ్వ
సతతవిత్తార్జనరతములు మతములు సమ్మోహనవిధానసద్యవిద్య
తరుణజనాశయదాహముల్ దేహముల్ చిత్రచౌర్యవిధానశీలశీల
గీ. కామిజనమానసంహ్వాతిఘనము మనము వారనారీజనంబుల కారయంగ
వీరి సృజియించునప్పుడవ్విశ్వకర్త యేగతిని నిల్చె వంచనలోఁగకుండ ౧౧౯॥
ఉ. నాలుగుజాలు జారుల కనల్గురికిన్ సమయంబుఁ జెప్పినన్
బాలిశుఁ డొక్కఁ డాత్మమతిఁ బట్టఁగ జాలక యింతి గూడన
వ్వేళ కుమున్న గాని యతఁ డీరుని ద్రోయఁదలంచి వచ్చినం
దాలిమిలేక యిర్వురును దైత్యులచాడ్పునఁ బోరి రుద్ధతిన్ ౧౨౦॥
సీ. ఒకని మంచముక్రింద నొకరుంగ దాఁచి వేఱొకనితో సరసోక్తులకుఁ గడంగు
వానిమూలకుఁ ద్రోచి ద్వారంబు చెంగటి మూవిసితోఁ గొన్ని మాటలాడు
వేఱొకఁడే తెంచి వెచ్చమెక్కుడొసంగ వీనిని నొకతల్పు వెనుక నుంచు
వాఁడు కగలవాఁడు వచ్చుచో వీనినిఁ గిటికి వెంబడి వాకిటికిననుపు
గీ. వారలన్యోన్యము నెఱింగి వైరమూని దురమునొనరించి రతిఘోరతరముగాఁగ
నీరకుండెను నేఁటికి వారి తగవు వారిలో నేనొకండ నెయారయురిది ౧౨౧॥
ఆ. కులము నెఁగఁ బోదు తలఁపదు వృత్తిని వావిలేదు మూర్ధవంబు జూడ
దమలరూపమెంచ దరమము ముఖ్యంబు పడఁతు చెలికిఁ గల దెపరువు నవుపు ౧౨౨॥
క. అంతటివానికిఁ బుట్టితి నింతటి దుర్వృత్తిఁ గలిగె నేమనినిఁక నా
కంతయుఁ జెడిపోయిననే డింతటనీ తెల్వి గల్గె నేమి ఫలంబో ౧౨౩॥
క. ఈయఱుగు పైని మును పా రాయణశాస్త్రియును నేను నతిహర్షమునం
బాయక బాషించితిమిపు డీయారట మెంచవలనెనని కాలగతుల్ ౧౨౪॥
క. అని యెంచుచు వారాంగన యనవీనులు మూసికొనుచు నాత్మగృహమునన్
జననికిఁ గులభామినికిం జనువుగ ననుకూలవృత్తి జరుపుచు నుండెన్ ౧౨౫॥
క. దక్షాధ్వరశిక్షాపర యక్షాధిపబద్ధసఖ్య యైశ్వర్యనిధీ
యక్షాధిపగంధర్వా విక్షతకుసుమాస్త్రగర్వ వినతసుపర్వా ౧౨౬॥
క. చుక్కలఱేనిం దలపై నెక్కించిన ఱేఁడ వేల్పుటేటిసరమునం
జక్కనగు జడలవాఁడా ప్రక్కం జెలిఁ గల్గిట్టి వన్నియకాఁడా ౧౨౭॥

## మదనదర్పణవృత్తము.

సామజరిపువాహశావిభాస మానమానసా ధీమహితవిశుద్ధమాని సాధితస్వరూపకా
నామజపనిరాకృతోరుబంధభక్తసంచయా హేమనగశరాసనసంధితాహిసింజినీవరా

గద్య-

ఇది శ్రీమన్మంత్రిప్రెగడవంశపయోబ్ధిపారావార రాకాసుధాకర రాజబిరుదాం
కిత భుజంగరాయామాత్యపౌత్ర హరితసగోత్ర పవిత్ర దుర్గామల్లికా
ర్జునప్రసాదరాయవరపుత్త్రి శ్రీమార్కండేయ వరప్రసాదజనిత
కవితాధౌరేయ బుధజనవిధేయ భుజంగరాయనామధే
య ప్రణీతంబైన వారకాంతయను చాటుప్రబం
ధంబు నందు జతుర్ధవిలాసము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు.

శ్రీమార్కండేయస్వామినేనమః.

---

# వారకాంత.

---

## పంచమవిలాసము.

క. శ్రీనాథప్రియసుగుణని ధానా, రజతాద్రిసన్నిధానా, భక్తా
ధీనా, భుజంగభూషణ మానిజనావనవిధేయ, మార్కండేయా ౧॥

గీ. విన్నవించెద నైకథవిభుము దేవ కేశవుండెల్లధనమాసుకేశిపాలు
జేసిదుర్విధుఁడైక్లిష్టచిత్తుఁడగుచుఁ దల్లడిల్లఁగ మెల్లఁదల్లియనియె ౨॥

ఉ. ఏలవిచారమందెదవు డెవ్వరు చెప్పిన నచ్చరాయెనీ
లీలలనస్మదీయవిధి లేవడిజేయఁగ నెలదప్పునో
బాలకయున్నహీనులయి ప్రాణములిట్లు వారలుండరే
మేలొనఁగూడకుండదు సుమీ చిరమాయువుగల్గెనేనియున్ ౩॥

చ. పదలుము చింత వెండియును బైడియు మోగుచునుండునంతసం
పదగలకొంపకిట్టివగపాటులు బొందగనయ్యె నక్కటా
చదరయెగాకయుండునొకొ చాపచినింగిననన్నవస్త్రముల్
కొదుకకగల్గుసంపదలకున్నునొచనిదెట్టుగల్గెడున్ ౪॥

క. పసపునకైనీభార్యకు నొసఁగిరిపుట్టింటివారలొక్కంతమహిం
బొసఁగంబ్రానందీనం గుసుమముగతిఁగాపురంబుఁగొనకొనినిల్పన్ ౫॥

శా. కైవారంబుగ దోఁచునోపరులకుం గానిమ్ము వాక్రుత్తుల
క్ష్మీవాణీగిరిజాసమానయగుచున్ మెప్పొందునీభార్యనీ

